except 8

Reg No M757

శ్రీ

# అభినవసరస్వతి.

యను నొక మాసపత్రిక.

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ
బ్రచురింపఁబడుచున్నది.
గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.

సంపు 3. ] 1911 సం॥ జనవరి [ సంచి 1

విషయములు.



చందా నిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25-0-0 | సహాయులకు | రు 5-0-0 |
| పోషకులకు | రు 10-0-0 | చందాదారులకు | రు 2-0-0 |

భారతీవిలాస ముద్రాక్షరశాల, నర్సారావుపేట.
Printed at the Bharati Vilasa Press,
Narasarowpet. and published at Janapadu
by the Editor Astavadhani
Janapati Pattabhirama Sastry.
1911

## సహాయులు.

1 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.
2 రాళ్లభండి రాజయ్యగారు, విలేజిమునసఫ్ చింతిరాల
3 రాజశేఖరుని లక్ష్మీనారాయణగారు, కరణం, చిట్యాల
4 కాసిరాజు అశ్వద్ధనారాయణగారు, పాపయ్యపాలెం.
5 కంచర్లలక్ష్మయ్యగారు, ఫారెస్టుగార్డు, డిటో
6 తంగెడనరిసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
7 కోలాపిచ్చిరెడ్డిగారు, గ్రామమునసబ్, దాచెపల్లి.
8 గోపాలునిరామలింగయ్యగారు, ముప్పాళ్ల.
9 వెలుగూరిపిచ్చయ్యగారు, పెదకొదమగుండ్ల.
10 పిరాట్లసత్యనారాయణగారు, చింతపల్లి.
11 నైషధంసీతాకాంతంగారు, మోరంపూడి.
12 కంభంపాటిచినవిదెయ్యగారు, మాచర్ల.
13 ఘుడియారం వెంకటశివశాస్త్రిగారు, సంగంజాగర్లమూడి.
14 సూరిదేవర సుబ్బానాయుడుగారు, తుమ్మపూడి.
15 శేకూరి వెంకటకృష్ణయ్యగారు, కరణం, శేకూరు.
16 నూతక్కినరిసింహనాయుడుగారు, విలేజిమునసబ్, మందడ
17 కొప్పరాజుగురుచంద్రశేఖరరావుగారు, ఫారెస్టుగార్డు, మెళ్ల
18 బూదరాజువెంకటసుబ్బయ్యగారు, కరణం, స్వర్ణ.
19 పిరాట్లసీతాకాంతంగారు, చింతపల్లి.
20 ఏలేశ్వరంవెంకటసుబ్బారావుగారు, వకీలు, సిద్దిపేట.
21 కలవలపల్లిరంగయ్యశాస్త్రిగారు, భాస్కరాచార్యులు యొ
22 మంచిళ్లనారాయణరావుగారు, కంభంపాడు.
23 తుమురుగోటినరిసింహారావుగారు, తిరుమలగిరి.
24 తడిసిన, రామధర్మారెడ్డి దేశముఖుగారు, కొయ్యెడ.
25 గుండాలవెంకటరెడ్డి, దేశముఖుగారు, గుండవరం.
26 గంభీరరావుదేశాయిగారు, లింగన్నపేట.
27 సైదు ఖాసింసాహేబుగారు, ఫారెస్టుగార్డు, చింతపల్లి.

శ్రీమత్.

# అభినవసరస్వతి.

——:(o):——

[ఇది మాసమున కొకసారి ప్రచురింపఁబడును.]

| సంపు 3 | జానపాడు.<br>సాధారణ సం॥ పుష్య మాసము. | సంచి 1 |
|---|---|---|

## స్వవిషయము.

ప్రత్తిపాటిసభికుల యభిమానమునను మ॥ రంగావఝ్ఝులహనుమయ్యగారి యొక్కయు పులిపాకపూర్ణయ్యగారియొక్కయుఁ దిప్పరాజు కామేశ్వరరావుగారి యొక్కయుఁ బోషణవలనను మఱికొందఱిసాహాయ్యాదరణములవలనను నభినవసరస్వతి యట్లనో యిప్పటికి వత్సరద్వయవయస్క యైనయది-ఈపత్రికాబాల యింకనుదృఢగాత్రయై చదువరులమనంబుల నకాలమునకు సంతోషపెట్టుచుండెఁ గాని యట్టిస్థితిని దత్పోషణోచితులగు నిజాంరాజ్యమందలి తత్తత్సుహృత్తుల దర్శించివచ్చునంతటి దార్ఢ్యమును దాదృగవకాశమును నొసంగక నాకో? నాతికో? సూతికో? యెడమీయక మెప్పియో గడబిడలు గలుగఁజేయుచు సర్వేశ్వరుఁడే సమకూర్పఁడాయె. ఏతన్మాత్రప్రాయమైన నగుటకు ముద్రాక్షరశాలఁ గర్నూరావుపేటలో స్థాపింపబడుటయు నందు మా బందుగుఁడును స్నేహితుఁడును నగు ములుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రి తదధికారియగుటయుం గారణములు గాని పత్రికాగ్రాహకులనుండి వచ్చిన పారితోషికము కాదు. పత్రికా స్వీకర్తలేపలుముంది కాని పారితోషికప్రదాతలుమాత్రము బహు స్వల్పము, చందానిమిత్తమై వి. పీలు పంపితే దిరిగివచ్చెడివి యెక్కువ స్వీకరించెడివారెక్కువ. ఈ త్రిప్పికొట్టుటవలనుండి పెద్ద

మనుష్యులవలననే జరుగుచున్నందున మాపని "మూసితే మూగ తె
రిచితే రాగ" యన్నట్లున్నయది. అన్నియు గుమ్మడికాయంతము
త్యములే మైనప్పు డిందులో నెవరి నేమనఁగలముకని యయ్యలా
రా! పురాణం లక్ష్మీనారాయణపాటి పుణ్యజనులుమాత్రముకాకుఁ
డు. ఈఘనుఁడు తానంతఁదా సహాయులలోఁ జేరుచేర్పించికొని సం
చికలు సొంతింబుగాఁ గైకొనియుఁ జందామాత్ర మొసంగక సకల
శ్రమములకుఁ లోనుగాఁజేసెఁ గావున నిట్టివారలుమాత్రము కాక
కంచర్ల లక్ష్మయ్యగారివంటి గణనీయులు కంతు పుప్పలపాటి వెం
కటసుబ్బయ్యగారును నిట్టిరులే ఈసంవత్సరమున బూదరాజు వెంకట
సుబ్బయ్యగారిని వెలుగూటి పిచ్చయ్యగారిని కంభంపాటి చినవీర
య్యగారిని దత్తోజస్కప్రేరితాంతరంగుండనై సహాయులలోఁ జేర్చి
కొంటిఁ గావున దయాళువులై తథ్యం బొసంగుదురుగాత.

చం॥ పదుగురియాదరంబునకుఁ బాత్రుఁడఁగాఁగఁదలంచి నేను మీ
కిదె మొదలస్మదీయమగు నీనెలపేపరు పంపుచుందు నో
చదువరులార! పంపఁబడుసంచికలన్నియు స్వీకరింపుచున్
సదయులకౌచుఁ దత్క్రయ మొసంగఁగఁ జూడుఁడు సత్వరంబుగన్

తే॥ అభిమతమె లేకయుండిన నాదినుండి వచ్చువానిని మరలింపవలసియుండు
ఈర కరుడెంచుసంచిక లోపికఁగొని క్రయమునిమ్మన్న వలదంట క్రమముకాదు

సరస్వతి.

మేనేజరు వ్యాధిగ్రస్తుఁడై కొంతకాలమునుండి యంతరువు
పడియుండిన యీపత్రికారాజము మరల దివాకర్ల తిరుపతిశాస్త్రిగా
రిచేఁ బ్రకటింపఁబడుచు 1910వసంవత్సరపుఁ బలుసంచికలతో మాం
కార్యస్థానమలంకరించినది.

మొదట రిలాధ్యక్షుఁడైనదానికిఁ గింకవీంద్రఘటాపంచాననులును
బాలసరస్వతులును శతావధానులును నగు తిరుపతిశాస్త్రిగారిమే
నేజిమెంటు బంగారమునకుఁ బరిమళమువచ్చినరీతి భాసింపఁగలదు
దీనిచందా సం॥కు రు3లు వలయువారు కాకినాడకు వ్రాయువలయును

ఈశ్లోకమున రెండవకవిగారి పాండిత్యమంతయు వెళ్లఁ బోయఁ బడి యున్నది. కాని కవితారచనం బట్టి చూడ వీరు వ్రాసికొన్న వ్రాఁత శుద్ధాబద్ధ మని తేలుటచేఁ బ్రకృతానుగుణ మగునర్థము చెప్పనిచో నియ్యది దశదాడిమాదివాక్యమువలె నున్మత్తప్రలాపము గావలసి వచ్చును. ॥శ్లో॥ ఏకాదశ్యా మహోరాత్రం కర్తవ్యం భోజనద్వయం॥ అన్నచోటంబలె నియ్యెడఁ గొంకొక క్లిష్టపదచ్ఛేద మంగీకరించి ప్రకృతపుఁ దెల్వి తేటలను వెలిపుచ్చవలెను. లేదా! చిరకాలగురుశుశ్రూషాసాధ్య మగునీవిషయమునఁ బ్రతిమనుజుఁడును నధికారి యగుటను విద్వల్లోక మొప్పికొనదు. కావున "ఆ, భాష్యాంతం, అని పదచ్ఛేద మొనర్చినచో వ్యాకరణము కొంచెముగా నధ్యయనముచేయఁ బడిన దనునభిప్రాయము తేలి యసత్యదోషమును వారించును. లోకమున నసత్యదోషమునకు మించినదోషము వేఱొండు లేదు గాన నది యీతీరున వారింపఁబడుఁ గాక, భాష్యఁ, అంతే, యస్య, (భాష్యము తుట్టతుదను గలది) అని విగ్రహము చెప్పినచో భాష్యాంతపదమునకు వ్యాకరణ మనునర్థము సుగమము "శ్లో॥ ఆ జీవదర్థేఽభివ్యాప్తౌ॥ అనుటచే నీపదర్థకత్వ మాకుఁ జెప్ప వచ్చును. 'ఆ, అభివ్యాప్త్యర్థకము కాఁ గూడదా! యనినఁ బ్రథమాతిక్రమణమునఁ గారణము లేదుకదా! పైపుచ్చు "భక్షితేఽపి లశునే న రోగశాంతిః" (ఉల్లిలిన్నను రోగశాంతి కాలేదు.)అనున్యాయమునఁ దిరిగియు దోషము తదవస్థమే కావలసి వచ్చును. ఇంక "అధీతం"అనుచో నావృత్తి చేసి యొకసారి "చదువఁబడినది" యనునర్థమును మఱియొకపరి "న,ధియా,ఇతం" అనువ్యుత్పత్తి ననుసరించి బుద్ధిచేఁబొందఁబడలేదు. అనునర్థమును జెప్పికొన్నచోఁగొంచెము వ్యాకరణము చదువఁ బడినది గాని యదిబుద్ధి కెక్కకశుకానువాదమై చెట్టెక్కినది యని తాత్పర్యము సిద్ధించును ఎవరికో కానిశాస్త్రములు చదివినను దెలియుటయరుదు కావున నే "శ్లో॥ కేచి ద్భగ్నాః ప్రక్రియారంభకాలే కేచి ద్భగ్నా స్సన్ధ్యుపాస్యేతి సంధౌ, కేచి ద్భగ్నా యుష్మదస్మద్విచారే సర్వే భగ్నాః కారకప్రక్రియాయాం" అని ప్రాజ్ఞులు వల్కుదురు, కష్టించి చదివినవారిగతియే యిటు లుండ వృథాప్రగల్భములు వల్కువారియవస్థ వేఱె చెప్పవలయునా! "శ్లో॥ అనభ్యాసే విషం శాస్త్ర మజీర్ణే భోజనం విషం" పోనిండు చదువకయే మాకు వ్యాకరము వచ్చినది "తదధీతే, తద్వేద" అని యుంటచే రెండవపక్షము ననుసరించి మేము వైయాకరణుల మందురా! సమ్మతమే కాని "అధీతం" అనుపద మధోగతిపాలు కాక తీఱదు. మఱియుఁ జదివినను బుద్ధి కెక్క లేదనునర్థము చెప్పికొనుటకు నాల్గవచరణములోని "దూరేలిప్తతు" అను వాక్యము పూర్తిగాఁ బ్రోత్సాహక మగుచున్నది. ఇందుల కింతకు మున్ను చూపిన య

సంగతద్వంద్వాదికము లుదాహరణములు సమాసవిషయముననే వీరు పప్పులో నడుగు వేయుటచే కారకప్రక్రియలో భగ్నులని స్ఫురించుచున్నది. ఔరా! ఆభాష్యాంత మథితం! ఎంత పైపై నున్నది. మఱియుఁ బై విషయమునకుఁ బ్రకృతగ్రంథములోని యీపంక్తులు గూడ గొంతవఱకుఁ దోడ్పడుచున్నవి.

"ప్రసంగము గురువుగారితో సంధిపరిచ్ఛేదమున నొనర్పఁ బడినది." (82-వ పుట చూడుఁడు) మఱియు నందే 17-వ పుటలోని పంక్తులు దిలకింపుఁడు.

68 మాకవిత్వమ్మునందు దోషము లున్న సభవారిని క్షమింపఁ బ్రార్థింపుఁడనుట.

"తే॥గీ॥ తప్పులుండవు మాకవిత్వమ్మునందు,
శాస్త్రములలోనఁ బొండిటి సంగ్రహించి,
యుంట; నెందైనఁ బొరపడి యున్న మేము,
వెనుక దిద్దెద మద్దాని వీలుకొలఁది"

శాస్త్రములలోఁ బొండిటి సంగ్రహించినారఁట! తప్పులుండవఁట! "మాతరపి తరా" అనుచోఁ గలదోషము నిఁక నెప్పుడు దిద్దెదరో! ఇంకను వీ లిచ్చినది కాదు కాఁబోలును లేక వీలున కర్థాంతరము చెప్పికొందురో! ఈపద్యములో నియహంభావము బాలకవిత్వద్యోతకచిహ్నములలో నొకటి యనుకొందము ఇంతకు మున్ను చూపినతోవక వృత్తప్రచారమును 76-వ పుటలోని "కూచినరసింహముగారు, తరల" అనుశీర్షిక క్రింది వృత్తమును గూర్చి విచారింపఁగా నవియును బాలకవిత్వద్యోతకములుగనే కన్పట్టు చున్నవి ఛందోవిషయమునఁ బ్రౌఢగ్రంథ మప్పకవీయము గాని సులక్షణసారము కాదు లక్షణసారముయొక్క యసారతను గూర్చి యిటవ్రాయుట యప్రస్తుతము. అందెన్నో తెలివితక్కువలు కలవు. తోవకమును వీరితరలయుఁ నప్పకవిఖ్యాతమున దోదకమును విచికిలితయు నగుచున్నవి నామాంతరసద్భావమునకుఁ గూడ నతనిన మ్మతి లేదు. ఉన్నవానికిఁ జూపుచునే యున్నాఁడు ఈవృత్తద్వయమునకు భారతాదిప్రమాణముగూడ మృగ్యముతోవకమింతుక భేదముతో నామసామ్యముగలదియేయైన

నువీరితరలకు లక్షణసార మాధారము కావలయునే కాని యప్పకవీయము బొత్తిగా సంబంధింపదు పృచ్ఛకు లట్లుకోరి రందురా! వీరుపృచ్ఛకుల సమ్మతింపరుగదా! ఛందోవిషయమున లక్షణసారము ననుసరించి యప్పకవీయమును త్యజించుట "కాపు థేనా స్థితాయాం కరభ మనుసరాయ్య" అనునప్పయదీక్షితోక్తిని జ్ఞప్తికిఁ దెచ్చెడిని ఏవిధమైన యాధారమును లేకయే వృత్తములు పుట్టుచున్నయీదినములలో నేదో యొకయాధారము గలయీరచన యంతగా విచార్యము కాదు గావున నీవిషయము మున్నే యుపేక్షింపఁ బడియె గాని బాలత్వసమర్థనమునకు వీరివయస్సు పనికిరానందున నిది ప్రకృతము సింహావలోకనన్యాయమునమరల నుదాహరింప వలసి వచ్చినది ప్రకృత మనుసరింపుదము వీరికవనము దోషదూషితమును నిస్సారమును ననునంశము ను సభ్యులు విమర్శకులకన్న మున్నే కనిపెట్టినరహస్య మిపు డుదాహరించిన పద్యము మొదటి యవతారికయే తెలుపుచున్నది వ్యాకరణముగానిఛందస్సు గానిచక్కఁగఁదెలియ దనియు వట్టిప్రగల్భములు వ్యయపుచ్చువారును నని యెఱుఁగనిచో నట్టి ప్రశ్న వేయుట కెన్నివేలగుండెలుండును! ఇకఁ నాశ్లోకమందలియితరాంశము లుచర్చింపఁ బడుఁగాక తర్కముగఁ గాలుమాత్రమే యుంచినట్లు కవియే వ్రాయుటచే నట వ్యాఖ్యానాంతర మపేక్షింప బడదు "మరువదు శీనరేష్వు జల"మనినట్లు తర్కములోఁ గా లెంతవఱ కుంచఁబడినదో! వ్యాకరణమున వ్రేలును నంతవఱకే యుంచఁ బడిన దని ఫలితార్థము "ఆలంకారికశాస్త్రిం" అనుచోఁ గూడ "అ" అని ఛేదించినచో వెనుకటిచొప్పునఁగొంచె మునునర్థము రాఁగలదు, దానిపై నలంకార సంప్రదాయము తెలియ దనునంశము తేటతెల్ల మగును దానిచే నీక్రిందికవనమునం గలపోలికలు సంగతము లగును.

## 93 మిక్కిలి కష్టము.

క॥ "వెలవెలఁదిపగిది నెంతయు। విలవిలలాడంగ నిలిచి వేపురిలోనఁ
సలలితముగఁ గవనంబుల్ । బలి కెడిచో నెంతకష్టపడితిమిభూపా॥

(21వ పుట చూడుఁడు)

ఇందలి "విలవిల" "అవిరేణికుండసామెతకును" "ఎంతకష్టపడితిమి" "ఇంతవి ద్యాడి" సామెతకును జ్ఞాపకము లగుచున్నవి, ఇదియే కాఁబోలు నలంకారశాస్త్రిపాంణిత్యము!

౦

100 తొంబదితొమ్మిది పద్దెములఁ జెప్పి నూఱవపద్దెముఁ
జెప్పునప్పుడు మీ కుంచు తెఱఁగు

ఉ॥ కట్టెలమోఁపు మోయ నఫకం బగుదానిని దెచ్చి నెత్తిపైఁ
బెట్టిన వాఁడు దానిఁ గడు బీదతనమ్మున మోచి భూమిపై
నెట్టులొ దింపి యూపిరిడ నెట్టులు మోదము నొందునట్టులే
గట్టిగ సంతసంబు గనఁగాఁ గల రీకవు లిట్టినట్టునర్॥

చూచితిరా! ఇందలిసారస్యము దీనిచేఁ గవిత్వ మెట్టిదియో ధ్వనించుచున్నదా! ఇది ధ్వనివేత్తృత్వము కాఁబోలును. ఇంకను నిట్టి వనేకములు చూప వచ్చును వీరు సావకాశముగ వ్రాసి ప్రచురించిన మదాలసయందే తప్పులు కుప్పతెప్పలుగ నున్న నిఁక నాళుధారలోనా! కనుపడ కుండుట; తక్కినశ్లోకభాగము విచారింతము "దూరే తిష్ఠతు తత్" న్నైఁ జెప్పినకారణములచే నీయుభయశాస్త్రజ్ఞానమును దూరమున నుండుఁగాక. "యద్యాపి" ఇట "అపి" చార్థకము గనుకఁ గావున నే యను నర్థము వచ్చును. "కవితా విద్యైవ స్వాద్యా మమ" ఇయ్యెడ "కవితా అవిద్యా అని ఛేదించి" న విద్యతే విద్యా జ్ఞానం యస్యాః అని విగ్రహము చెప్పికొన్నచో నజ్ఞానభూయిష్ఠ మగుకవిత యని తేలును ఏవకారము భిన్నక్రమముగా సూత్రములందుం బలెనన్వయించినచోఁ దుది నున్నస్వాద్యాశితమునకు సంబంధించును అప్పుడు "పూర్వోక్త మగుకవిత నాకే హృద్యము అనునర్థము రాగలదు. వీరు ప్రాథమికులు గదా! తలుచు ప్రాథమికులువాక్యములునూత్రప్రాయములు గానుండును కావున నిట్టిభాష్యము వాని కుండుట యుక్తము తేలినసార మిది కొంచము వ్యాకరణము చదివితిని గాని యది నాబుద్ధి కెక్క లేదు తర్కము మొదలిడితినే గాని చదువ లేదు అలంకారశాస్త్రముప పర్కమువలెనే యైనది కావున నే వీనికిని నాకును గడు దవ్వగా వలసి వచ్చినది నాకవిత్వ మజ్ఞానభూయిష్ఠ మగుటకు హేతువు పైని జెప్పినదియే ఆకవిత్వము నాకే ప్రీతికరముగా నుండును" ఇట్టివ్వరేని జెప్పికొనుట కలదా! యనినచో వీరును నిట్లు చెప్పికొన లేదు వారితాత్పర్య మిది కాకున్నను యథార్థపక్షపాతి యగుభగవంతుఁ డీత్రోవ నిం దిమిడ్చె నని యూహింప వలసి వచ్చినది. పనికి రానికవనము గ్రంథకర్తకు మాత్రము హృద్యముగా నుండునా! యందు లేని అట్లుండుట తటస్థించినచో నీప్రస్తుతకాలమున ననేకులు గ్రంథములను వ్రాయుట మానఁ దగినవారు కల

రు. అట్టిచో వారివారిప్రవృత్తివలన "కాకిబిడ్డ కాకికి ముద్దు" అనుసామెత ననుసరించి యెవరికనవము వారికి సమంజసముగనే తోచును ఇతరులమా టెట్లున్నను వీరికవనము రసవత్తరమే యనుజ్ఞానమును దానికి సంబంధించినబోలెడుగర్వమును వీరి కున్నందుల కుదాహరణములు.

"ఉ॥ ధారణ తప్ప రాదు కవితారసమాధురి పోవ రాదలం
కారము లేగ రాదు కనఁగా నపశబ్దము లుండ రాదు వా
గ్ధోరణి యాఁగ రాదు తమతోడఁ బ్రగల్భము లంటఁ గాని యె
వ్వారికినైన నిట్లు నుడువం గలవార మనంగ శక్యమే॥

(4 వ పుట చూడుఁడు)

చూచితిరా! యిందలిడచ్చీలు! నాల్గవచరణములోనియంశమును బరికింపుఁడు ఎవరును నిట్లు నుడువ లేరఁట! దేనిని నుడువలేరు! కవిత్వమును గాదు. డచ్చీలను శక్తి లేనిబీరములు పల్కుట కంతరాత్మ యొప్పికొనదుకదా! అట్టిస్థితిలో నంతరాత్మ నిట్టియసత్యప్రచారమున కొప్పించినవీరిప్రజ్ఞాతిశయము మిట శ్లాఘ్యము ఇఁక నొకటి.

"ఉ॥ప్రాకటసత్కవిత్వపరిపాటిని మేము రచింపుచుండఁగా
మా కెదురైరసజ్ఞుఁడయి మంచియుఁ జెడ్డయుఁ నేర్చి ప్రోడయౌ
లేకరి యొక్కఁ డుండ వలె లేక కదుర్ గదు నింపు నింపియుఙ్
మాంకవితారసాయనము మాకును మీకును దూర మయ్యెడుఙ్

4వ పుట చూడఁదగు.

అట్లు దూరమైనచో మీయిరువురికే కాక జగమ్మునకుమాత్ర మేమి లోటు! లేకరి తమకు సరి గావలెనఁట! ప్రోడగా నుండవలెనఁట! పైగారసజ్ఞుఁడు కావలెనట ప్రోడయును రసజ్ఞుఁడును నైనలేకరి తమయుపమానమున కొప్పుకొనునా! తమప్రోడతనమనఁగా! కోహినూరువజ్రమును వెత్తివేసకాయతోఁ బోల్చునదియే కాదు! అట్టివానికిఁ దమతోఁ బోలికయు నిట్టిదియే కాదా! ఇఁక నొకటి చూడుఁడు.

"ఉ॥ పాయక కబ్బముఙ్ గఠినపాకముగా నొనరించిపండితా

వ్యాయసముఁ బొనర్చు మనువారలా! లేక భవత్స్వభావస్థలిఁ
హాయిగ విన్నవారు వహవా! యని మమ్ము బహూకరింపఁగాఁ
దీయనిపల్కులన్ మిగులఁ దెల్లముగా రచియింపు మందురో,,

౯ వ పుటచూడుడు.

కఠినపాకముగాఁ గబ్బము నొనర్చి పండితావ్యాయసముఁ బొనర్తురఁట! ఆపాక మింతకుమున్ను చూపినకొబ్బెరమోఁపుపాకమే యగునా! లేక విలువిలపాకమా లేక వ్యాసాభ్యుదయములోని "పూర్ణశశితోడ సెమ్మోముబూఁతులాడుపాకమా! లేక కోడిగ్రుడ్డులనునీకలఁబీఁకెడువారిపాకమా! విన్నవారు "వహవా" యందురఁట! ఇట్టికవిత్వపాకములను విన్నవారు కేవలము "వహవా!" యందురా! దాని కించుక చేర్చి యందురా! దీని నిటులుంచి యింకొకటి చూడుఁడు.

"ఉ॥ లాతులరీతి మమ్మును దలంచుట న్యాయము కాదు మామువి
ద్యాతిశయంబు మాసుకవితారసమాధురిఁ జూపి లోకవి
ఖ్యాతి వహింప వచ్చితిమి కాని ధనార్జన మాచరింప నిన్
జూత మటంచురా మిదియ సుమ్ము యథార్థము రాజసత్తమా!

౯ వ పుట చూడుఁడు.

లోకవిఖ్యాతివహింతురఁట! అయినచో రిజష్టరుత్తరములమూలకముగ "మా కేవిషయమునఁ బాండిత్యము కలదో! తెల్పుఁడని యడిగినబ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రిల వారికే సమాధానమునుజెప్ప లేక "తిర్పతీ" యనియు మకేమియో యనియుఁ బరుషోక్తులతోఁ బాటుగాఁ బద్యములు వ్రాసి యంపుటతప్ప సభాముఖమునను వచ్చుటంగుఱిచి యెత్తుకొన కేల మానినారో వారిని "తిర్పతీ" యన్నంత లోకవిఖ్యాతి వచ్చు ననుకొనిరేమి. వచ్చుఁగాక యిఁక నొకయప్రగల్భోక్తిం జూడుఁడు.

"ఉ॥ అక్షరలక్షలిచ్చునృపుఁ డట్టికవీంద్రులు గాన రారటం
చీక్షితి వార లెల్ల వచియించెడిసుద్దుల నాలకించితే! హ
ర్యక్షసదృక్ష! మేమును దిరంబుగ నీవును గక్ష కట్టి ప్ర
త్యక్షము సేయఁ బూనుదమె తత్సముఁ గవుల న్నరేంద్రమునిన్

(౯-వ పుట.)

కక్షగట్టెదరఁట! ప్రత్యక్షము సేయఁ బూనెదరఁట! అక్షరలక్ష లిచ్చినవాఁడు భోజుఁడు, పుచ్చుకొన్నవారు కాళిదాసాదులు, వీరు ప్రస్తుతకాలకాళిదాసులు కాఁబోలును: శ్లో॥ కవయః కాళిదాసాద్యాః కవయో వయ మప్యమీ । పర్వతే పరమాణౌ చ పదార్థత్వం వ్యవస్థితం॥ అని మహామహు లగుకవులందఱును వర్ణించిన కాళిదాసు నేఁటికి వీరుగా మాఱెనోటు! కానిండు, ఈపద్యము నెక్కడినుండి వీరు సంగ్రహించిరో యాశ్లోక మిట నుదాహరింతము. "శ్లో॥ రాజాఽఽస్తే యది భోజరాజసదృశః కుత్రాఽపి వా భూతలే కాళిదాససమః కవి ర్విజయతే యత్ర క్వవా కోఽపి వా ఇత్థం యద్యపి వృద్ధవాక్య మమలం తథ్యం త్వయా రచ్యతే యః కోవాఽపి చ విశ్రుతే యది కవి స్తాదృక్సదై దుర్లభః" (తిరుపతివెంకటేశ్వరులశతావధానసారము 31-వ పుటఁజూడుఁడు.)

పైపద్యము దీనినుండి సంగ్రహించి యందు వృథాహంకారము కొంత క్రొత్తగాఁ జేర్చి బాగుసేయఁబడినది. పరిశీలించినచో దానికిని దీనికిని గలభేదము స్పష్టపడును. వీరికిఁ గాళిదాసమ్మన్యత్వము మనమునందుఁ గల దనుట కిం కొకటి చూపుచున్నాఁడను.

"ఉ॥ భోజసమాను నర్థిసురభూజునిఁ జూచితి రే! పిఠాపురీ
రాజు సతంబు మిమ్ముఁ గవిరాజుల నెట్లు బహూకరించె నం
భోజను గోపవారికి సదుత్తర మిచ్చి తదాననంబులన్
దేజరిలంగఁ జేసె నగతిన్ మము నీవును గౌరవింపుమా॥

(పైపద్యమునకు సరియగు పద్యము నానారాజసందర్శనమున 56-వ పుటలో 5-వ సంఖ్య కడఁ జూడఁదగు.)

వీరిం జూచి "మిమ్ముఁ గవిరాజులన్" అని యనువారును గలరుగా! ఔరా! యేమి యీకాలము నందలికవులకు వీరు రాజులా! రాజులకు శౌర్య ముండవలెనే! రాజు తనపైకి వచ్చినశత్రువు నెదుర్కొనవలెనే! రా జనఁగా గాజులు దొడిగించుకొనువాఁడు గా నుండఁడే! ఈరాజత్వ మట్టిదే యై యుండనోపు! ఇది యొక తీరుదాంపత్యమన్నట్టు లిట్టికవిరాజులును నుందురుగాక. ఏమో! నేఁటికాలమునకుఁ గవితానతి నోఁచిననోము ఫలించి యిట్టివారు దయింపఁబోలు! ఇఁక నొకపద్యముం జూడుఁడు.

"ఉ॥ చాలఁ బరిశ్రమం బొకట సల్పినవారము శాస్త్రపద్ధతిన్
మూలము ముట్టఁగాఁ గవనమున్ గని యారసినారమింక నీ
పాలికి నేగుదెంచి రసభావగుణంబులవాకవిత్వమున్
మే లనిపించుచున్ వడిని మే లనిపింపఁ దలంపు భూవరా॥

(4-వ పుట)

మూలము ముట్టఁగాఁ గవనమున్ గని యారసినారలంట! చూచితిరా! గర్వోక్తులు. ఇఁక నొకటి చూడుఁడు.

"ఉ॥ విసర ప్రావ కుండఁగఁ గవిత్వము చెప్పితిమేని,, యి ట్లనా
యాసముగా రచింపఁగలరా! యెవరేనియు నింటియొద్ద మున్
వ్రాసినపద్దెమున్ జదువ వచ్చు నటంచును దోఁచఁగా వలెన్
వాసితసద్యశఃప్రసర వైభవనిర్జితపాకశాసనా॥

ఎవరును ని ట్లనాయాసముగా రచింపనే నేరరఁట! అవురా! వీరు బయలుదేరనిచో నీలోకమునందుఁ గవితాశూన్యమే కల్గును గాఁబోలును! ఆ! నేఁటికిఁ గఱవుతీఱినకవిత్వము తటస్థించినది. ఇఁక లోటు లేదు. ఈచూపిన పద్యము లింటియొద్ద వ్రాసినవియే కద! ఇందే యిన్నియసందర్భము లుండఁగా నిఁక నాశువులేనా! యుండ కుండుట; ఆశు వని పేరు గాని యవిగూడఁ జాలవఱకు నింటివద్ద సంఘటించినవే యనునంశము ముందు స్ఫుటపఱచఁ బడును గానఁ బ్రకృత మాయాయీపద్యము లన్నియుఁ దమపాటివాఁడు లేఁ డనునాశయము కవులకుఁ బూర్తిగా నున్నట్లు తేలుటకు సాధనము లగునో కాదో మాత్రము విచారించి దానిచే మున్ను నుడివిన యంశమును స్థిరీకరించుకొందముగాక. ఈపెండేరపు పద్యమును జూడుఁడు.

తే॥ రాజ! మే మభినవకృష్ణరాయబిరుద
మొసఁగినారము నీకు జన్మోత్సవమున
వెండియును మాకుఁ గవిగండపెండెరంబు
నప్పనము సేయఁగా నిది యవసరంబు॥

తే॥ గెల్పు భగవదధీనంబు గెల్తుమేని । నృపతి కౌదుము ప్రియులము నిశ్చయంబు
చత్తుమేని సురాంగనాచారుకటక। శింజితంబగు స్వర్గముం జెందఁగలము 33

(ప్రకాశముగా) ఓరోరి గొల్లపోఁడా! ఇపుడు కాఁబోవురా

కృ॥ (నవ్వి) నిజముఁ బలికితివి. ఓరీ! నిత్యభూతుఁడు మరలఁగాఁబోఁడు.

(తెరలో)

సీ॥ కండెలుగట్టంగ రెండుపిక్కలుబట్టి పుడమిపైఁబడునట్లు పడఁగ ద్రొబ్బి
జేగలాగుననట్టె శీవిపైఁబడదూకి పొరలించిపలుమార్లు భూమిమీఁద
మెసపట్లుచేఁగూడ మిడుకఁజేసిమఱింత మేషయుద్ధములచే మేలమాడి
యాకాశపథమున కతిజవస్ఫూర్తిమైఁ దగఁ బిల్లకోలలాఁ గెగురవైచి
బాలకృష్ణమూర్తి పడవైవ శివశివా! పొరలుచున్నవాఁడు ధరణిమిసులఁ
జావసిద్ధమయ్యెఁ జాణూరమల్లుండు। బ్రతుకుటెల్లనింక వట్టికల్ల 34

వేత్ర॥ (వేగముతోఁగూడునట్లుగా) ఆహా! వీఁడుచావనేచచ్చె

ఆ॥ కడుపుపగిలి నెత్రుకాల్వలై పాఱంగ। నాననంబు భయదమగుచుఁ దోఁచె
కనికెడంతలేసి కనుగ్రుడ్లు తెఱచితాఁ। గ్రక్కుదొడఁగె నగ్నికణములకట! 35

ఆ॥ ముకుపుటములనిడిన మొనవ్రేలఁ బ్రాణావ। సానపుంఖణంబు గాననగుచుఁ
గదలుటుడిగి పెద్దగట్టునాఁబడియుండెఁ బుడమి మోయలేక కడువడంక 36

ద్వార॥ ఛీ! యెంతకష్టకాలము?

కం॥ కడు బలవంతుండయ్యును। బుడమింబడి ముష్టికుఁడును బొలిసెంజామిత్రో
విడివడి బలదేవుఁడుతన। పిడిగుద్దులతో నెమొసలు పింఁడిగఁ జేయన్ 37

వేత్ర॥ అక్కటా! ఎంతకార్యము?

తే॥ పటుతరములగు కంసుని బాహువులన। జయురమారాజ్య మంటపస్తంభములన
నీతికినిసంఘ్రులన సిద్ధినేత్రములన। నెగడుచాణూరముష్టికుల్ నిహతులైరి 38

కాఁబట్టి యిఁకజయాశ నష్టిది

(మరల దొరలోఁ గలకలము)

కటకటా!

సీ॥ ముందు వెట్టాకత్తులందాల్చి చరియించు మహారాజవానులం బట్టిచంపి
మాయాప్రవీణులౌ మనుజరాడ్భృత్యులఁ బిడికిటిపోటులం బిండిచేసి
ద్వారసీమలలోనఁ దగ నాటఁబడినట్టి పెద యేదుముల్కులల్ పీకివైచి
విక్రమంబేర్పడ విఱిచి బేడెములన్ని తగిలి కవాటముల్ పగులఁదన్ని
కువలయాపీడనామకకుంభివరము। దంతములె శస్త్రములుగాఁగఁ దాల్చిలీల
రంగమధ్యముఁ జొచ్చిరి రామకృష్ణు। లేనుఁగుంగున్నలుంబోలె హెచ్చియిపుడు

ద్వార॥ (విని భయముతో వేత్రహస్తునిఁగూర్చి) కావుననిఁక నిస్సందేహముగాఁ గంస మహారాజు తనచావే తాను దప్పించికొనవలసినంతకీడు మూడినది. ఈవిషయమై యొకింతయుం బ్రతీకారము గానుపించదు. కానిమ్ము మనమిాజరిగినపూర్వవృత్తమంతయుఁ రాజుగారికి విన్నవించి యవహితులమై కనుచాటుగానుందము. అట్లుండి చివర కీకుతికెలుపోయినను స్వామిభక్తి విడువక చేతనైనంతవఱకు పాటుపడుదము. (ఉభయులును నిష్క్రమింతురు)

(అంతట రామకృష్ణులు ప్రవేశింతురు)

కృ॥ (అంతటఁ జూచి హర్షముతో) ఆహా! ఈరంగస్థల మెంతరమణీయముగానున్నది?

సీ॥ చుక్కలుచూచెఁబో చుట్టు ప్రాకారంబు మణిశిరోగృహముల మహితమగుచు
ముచ్చటగొల్పెఁబో ముందు ప్రాంగణభూమి యింద్రనీలపుటాల నెనయఁబడుచు
హర్షంబునింపెఁబో యయ్యింద్రనీలాలఁ బలుతెల్లటాల్ చెక్కఁబడినదగుచు
వింతజూపట్టెఁబో వీక్షింపఁగనువిప్పి మానితాస్థానికామంటపముల
మఱియుమిఱుమిట్లుగొలిపెఁబో మంటపములలంకరించుచునుండెడిలలితబహుళ
వజ్రమౌక్తికస్రగ్గంధవస్త్రధూప। దీపముఖ్యాద్యవస్తువుల్ చూపరులకు 40

రాము॥ (చూచి యాశ్చర్యముతో) తమ్ముఁడూ! ఇది విశ్వవిలక్షణమైనసృష్టిసుమీ

తే॥ ధాతనిర్మింపఁజాలఁ డిద్దానినరయ। విశ్వకర్మయు నేరఁ డీవిధపుసృష్టి
మాయకాఁడైనయట్టి యామయుఁడుకూడ। నిట్టివింతపనుల్ జేయునిట్ల యగునె

కం॥ సరికాదు నాకలోకము । సరికా దమరావతియును జర్చింపంగన్
సరికా దలవైకుంఠం । బురుతరమాఠంగవాటి యొప్పిదమునకున్॥ 42

(ఎత్తుగానుండుమంచలుచూచి) ఓహో! దిగంతములనుండి యరుదెంచి యెపరిదిక్కున వారధిష్ఠించినదిక్పాలురలా గీభూపాలురు రంగమంటపం బలంకరించుచున్నవారు.

కం॥ సవిలాసముగాఁ గదలెడి । స్వ వరశిరోభూషణముల ఛవిమిషచేతన్
నవనవమైనప్రతాపం । బివలకు రహిఁగ్రక్కుచుండి రీ భూపాలుర్॥ 43

తే॥ తమయురఃస్థలములయందుఁ దాల్చినట్టి । చంద్రహారాదు లెగురుచుఁ జాలఁ జిక్కు-
పడఁగ సామంతవసుమతీపతులతోడ । నిష్టగోష్ఠులనున్న వా రీ నృపతులు॥

(మిక్కిలిమీఁదికిఁజూచి కృష్ణునిఁగూర్చి) అబ్బాయీ! మనలఁజూచుటకుఁ ద్వరపడుచున్నమామగారు నేఁడంతస్థులమీఁదచిగురున కలంకారభూతమై కమానులు దింపికట్టఁబడియున్న క్రీడాభవనమునం గూర్చొని యాలస్యముఁ సహింపలేక యున్నవారు కావున నీయనతహతహయుపశమింప దగ్గరకుంబోవుదము (అని సోపనారోహణముఁ నటింపఁజేయుదురు)

కంసు—(దూరముననుఁజూచి వేగిరపాటుతోఁ తేచి)ఓరోరి సామంతులారా! సభికులారా!

తే॥ వంశమునకంతటికి మసివలె మదమున । బయలువెడలినయట్టి యీపాతకులను
నవలకీడ్వుఁడువేగ మదక్షిపాత । భూరితరవహ్నిఁబడి మ్రగ్గిపోకమున్నె॥ 45

సభికులు—(అందఱువిని సాదరముగాఁజూచి యానందముతో) ఓహోహో!

సీ॥ మల్లయుద్ధపరిశ్రమమున నేర్పడినట్టి చెమటచుక్కలమోము చెల్వువాఁడు
పట్టుదట్టీచేత బాగుగానుబిగింపఁబడిన జల్సన్ననినడుమువాఁడు
నెమిలిపింఛాల్ బెట్టి నీటుగాఁజుట్టిన సొగసుగుల్కెడి కొండసిగలవాఁడు
గళసీమఁ బొరలెడి కమలమాలికనుండి పోయిన గంధపుంబూఁతవాఁడు
దండిదైనట్టియేనుఁగు దంతములను । జక్కనిమిడిచికొన్నట్టి చంకవాఁడు
గోపవృద్ధగు నందుని కుఱ్ఱవాఁడు । అన్నయుండదాను నిదె వచ్చియున్నవాఁడు॥

(మరలనూహించి సంతోషానుగ్రహములతో) ఆహా! అతిసుకుమారగాత్రులగు నీ నందగోపకుమారులసందర్శనముచే మన యంతరాత్మ పవిత్రమైనయది.

తే॥ పూర్ణిమాచంద్రతులితాస్య భూషితాంగు । శ్రీమదిందీవరశ్యాముఁ జిన్నికృష్ణు
రమ్యఘనసారసమవర్ణరౌహిణేయుఁ । గనియుదంబుధిమునిఁగెఁ గామనమనములు

(మరల సానుగ్రహముగా) ఇసీ! రాజుగారుపోయెడిది చాల దుష్పథము.

తే॥ ఇనుపులౌటను దప్పొప్పలెఱుఁగలేక । కనులపండువుగాఁ జిల్లపనులు పెక్కు-
లాచరించుచునుండు నందాత్మజులను । గూటయుద్ధంబులం జంపఁగోరినాఁడు॥

మఱియును ఈవిషయమై కేవలము రాజుగారి దొకరిదే తప్పుకాదు అట్టి దుష్కార్యమునుండి మరలింపని మనదికూడఁ దప్పే పెద్దలీరీతి నుదాహరింపరో?

తే॥ అసమబలులు నపుంసకుల్ ముసలివాండ్రు । స్త్రీలు బాలురు వృద్ధులుం దీనజనులు
బీడితాంగులు మత్తులుం బిచ్చివాండ్రు । పాఱువారు ననర్హులు పోరుసలుప॥

క॥ తప్పకథోగతిపాలగు । నిష్పథముం గాటున్నృపతి యిది తప్పనుచున్
జెప్పక తన్యాయమునకె । యొప్పనసభికులును ద్విగుణమొందుదు రఘమున్॥

ఇదియటులుండఁగాక

ఉ॥ వారణ మెవ్వరింపఁదగ నివారణసేయఁగలేకపోయె న
న్వారలచేతితీఁట యనివారితమయ్యె రణంబులోన న
వ్వారి నిరోధమున్ ధరణిపాలుఁడె చేయఁగఁజాలఁ డట్టిచో
వైరముఁబూనఁగన్ మనకు దార్ఢ్య మిఁకెక్కడినుండి వచ్చెడిన్ 51

కావున నీరాజును రాష్ట్రమును నష్టప్రాయములే యైనను నేతత్పరిత్యాగమే మన కుచితము.

కంసు—ఓరీ యేమిరా? ఎవరినుండి యేమియున్ భయములేనివారివలె నీపోకిరులు మదాజ్ఞోల్లంఘనంబొనరించి యిటే వచ్చుచున్నవారు? కావున వీరిరువురును రాజద్రోహి శిక్షాస్మృతిననుసరించియు నాతతాయివధవిధానముననునతిత్వరితముగా నిగ్రహింపఁదగినవారు (మరలరోషముతో) ఓహో యేమిది యింకను దయదలఁచుచున్నారు?

గుండయాహ్వాయుండు చతుర్వర్ణధర్మములును జతురాశ్రమధర్మములును దన్నుఁబ్రశ్నిచెనఁట. ఆ బ్రాహ్మణుని కీధర్మములఁ దానుబోధించెనఁట. క్షత్రియవైశ్యశూద్రులకు దత్తత్కులోచితధర్మములు జగత్ప్రారంభమునుండియే నిర్ణీతములై యుండ నీతఁడిప్పుడనువదించుటకు నవసరము. అట్లు చెప్పినచో సిద్ధసాధనతాపత్తిసంప్రాప్తమగు బ్రాహ్మణవర్ణమున సకలవేద వేదాంగపారగులును శాంతశమదమా ద్యనంత సద్గుణపరిపూర్ణులును నష్టాంగయోగనిరతులును సర్వధర్మప్రవీణులును ననాదిసంప్రదాయావిచ్ఛిన్నవంశానుక్రమాగతసత్కర్మనిరతులును బ్రహ్మవిద్వరిష్ఠులును బలుమందికలరు. తాదృశమహాత్ములవదలి త దనన్యగతికుండగుట యెంతయు విస్మయావహము. అనామ్నాతశ్రుతిస్మృతిపురాణేతిహాసగంథుండును నజ్ఞానాంధకారసంకనిమగ్నుండును హీనజాత్యుత్పన్నుండును దురభిమానుండును నగు నీతనివద్ద నా గుండయ్య ధర్మజిజ్ఞాసఁజేయుట కెట్టులిష్టపడును. వ్యాసులు కలి ప్రవేశించినబహుకాలమునకు మత్స్యగంధికిఁబుట్టి పాండువంశవువిఘపలంబొంని వంశవృద్ధిచేసియుండఁగాఁ గృతాదియుగత్రితయంబునఁగూడ నాతఁడుండి లోకోపకారకార్యంబులు పెక్కులాచరించెననుట కల్లయనియునక్కలికాలపురాజుల మంత్రబలముచే స్వవశులఁ జేసికొని చతుర్యుగంబులఁగూడ వర్ణాశ్రమధర్మంబులబోధించినమహర్షి తానేయని సన్నుతింపఁబడెననియు నా కశాదుఁడు వాక్రుచ్చియుండెను. సూర్యుఁడు నిజకిరణప్రసారముచే నుచ్చావచవస్తుభేదముందెలుపుచు సర్వప్రపంచమున నెట్లు ప్రకాశింపుచుండునో యట్లే స్వనిర్ణీతధర్మప్రచారముచేఁ బుణ్యపాపవిమర్శముంజేయుచు జతుర్యుగములయందును భగవంతుఁడగుబాదరాయణుఁడు సర్వోత్కర్షముగవర్తిల్లెననుట కించుకయు సంశయముండదు. కృష్ణభగవానులు పార్థునకుఁదత్త్వోపదేశముఁజేయుతఱి "శ్లో॥ ఇమంవివస్వతేయోగం ప్రోక్తవానహమవ్యయం। వివస్వాన్మనవేప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్॥ నాశవరహితమైనయీయోగమును వివస్వంతునికి నేనుజెప్పితిని వివస్వంతుఁడు మనువునకువచించె. మను విక్ష్వాకునకువాక్రుచ్చె" నని పలికినమీఁదనతఁడు "శ్లో॥ అపరంభవతోజన్మ పరంజన్మవివస్వతః। కథమేతద్విజానీయాం త్వమాదౌప్రోక్తవానితి॥ వివస్వంతునిజన్మ ముందును నీజన్మ వెనుకను నైయుండ నీ వాతనికి మొదలు చెప్పితివని యిదియెట్లు తెలిసికొనవలె" నని ప్రశ్నించుటయు నందుపై భగవానులు "శ్లో॥ బహూని మేవ్యతీతానిజన్మాని తవచార్జున। తాన్యహంవేదసర్వాణి నత్వంవేత్థ పరంతప॥ అర్జునా! నీవేమి నేనేమి యింతకుమున్న నేకజన్మములెత్తియుంటిమి కాని వాని నెల్ల నే నెఱుంగుదును నీవెఱుంగవు శ్లో॥ యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతిభారత। అభ్యుత్థానమధర్మస్య తదాత్మానంసృజామ్య

హం॥ పరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే॥ ఓభారతా! యెప్పుడెప్పుడు ప్రజల కభ్యుదయనిశ్రేయససాధనములగు వర్ణాశ్రమాదిధర్మము లడుగంటి యధర్మముప్రబలునో యప్పుడప్పుడు మాయచే నొందుదేహముధరించుచుందును. సన్మార్గగాముల సంరక్షించుటకును పాపకారుల బరిమార్చుటకును ధర్మమును దృఢముగా నిలుపుటకును బ్రతియుగమందును బుట్టుచున్నవాఁడను "అనుభారతకథాసందర్భమున నే పైప్రలాపమునకుఁ బ్రత్యుత్తరమీయఁబడియున్నయది.ఇఁక "శ్లో॥బ్రహ్మణ్యాధాయకర్మాణి సంగంత్యక్త్వా కరోతియః॥లిప్యతేన సపాపేన పద్మపత్రమివాంభసా॥ప్రభునిమిత్తమైభటుఁడుపలె నే మనుజుఁడీకార్య మీప్సితమువదలి యీశ్వరనిమిత్తకముగఁ జేయుచున్నవాఁడనని యాచరించునో పయఃకణముపద్మపత్రముంబలెఁ బాతకం బామనుజు నంటనేరదు" అనుగీతోక్తినను సరించి నిస్సంగులగుమహానుభావులకే విధినిషేధములులేకయుండ భగవంతుఁడగువ్యాసుని విధవాగమనాదిలీలామానుషకృత్యముల నధిక్షేపించినపాతకి కేమిజవాబు- ఇదియునుంగాక "శ్లో॥ విధవాయాంనియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతోనిశి ఏకముత్పాదయేత్పుత్రం నద్వితీయం కథంచన॥ అనుమనుధర్మమనుసరించియే మాతృనియోగమున మఱదండ్రరమించెఁ గాని మఱియొకటిగాదు. పుత్రోత్పత్తికిఁబూర్వమే భర్తలుపరలోకగతులై వంశచ్ఛేదమగుచుండఁ దత్ప్రార్థితుఁడై వంశమునిలుపుట తత్కాలమున కత్యుత్తమధర్మమయ్యెయుండెను "వంశవృద్ధిఁజేసె"నను నేతదాశయబోధక స్వవచనపువ్యాఖ్యానాతము నైనఁజూచికొనకుంట యెంతయువిచారణీయము. "శ్లో॥ ఇదం భాగవతంనామపురాణంబ్రహ్మసమ్మితం। అధ్ధితవాన్ ద్వాపరాదౌ పితుర్ద్వైపాయనాదహం॥ అనుశ్రీభాగవతద్వితీయస్కంధము వ్యాసులయుత్పత్తి ద్వాపరమందని ఘోషించుచుండఁగలిప్రవేశించినబహుకాలమునకుఁబుట్టెనని ప్రేలెడినిప్ప్రమాణున కేమిజెప్పఁగలము "శ్లో॥ ఆదిశక్తిమయంబీజంబీజశక్తిమయంశివః।శివశక్తిమయంవిష్ణుసర్వంవిష్ణుమయంజగత్॥అనియొకశ్లోకము"శివపురాణస్థ" మనివ్రాసెను. ఏతచ్ఛ్లోకార్థము"శక్తికినిశివునకును విష్ణువునకును బ్రపంచమునకును నభేద"మని ఈ శ్లోకముతోనగు నుపయోగ మెకింతయునాతనికిఁ గానుపించదు.మఱియు నీలాటి శ్లోకము లనేకములుండుఁగాక ఇచటవీనితోనుండు ప్రయోజన మేమియుఁ జూపట్టదు. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమహామతభాష్యప్రవర్తకవిద్వజ్జనుల కివియెంతయుఁ రుచింపవు. "శ్లో॥ గుణేభ్యోలక్ష్యమాణేభ్య స్త్రయోదేవాభిజజ్ఞిరే। ఏకమూర్తిస్త్రయోభాగా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః" అనియుండుఁగాక.

క॥ నలసింగభూవిభుండును । నలగామమహీశ్వరుం డనంగ ధరిత్రీ
వలయముఁ జూడఁగవచ్చిన నలకూబరులనఁగ వర్ణనకు నెక్కి రిలన్ 274

తే॥ భూరమాదేవి కిద్దఱుపుత్రు లందు । గట్టిపెరుమాళ్లనంగ జగద్ధితుండు
జెట్టిపెరుమాళ్లు విక్రమార్జితయశుండు । నిట్టితనయులఁగని ధరణీశ్వరుఁడు 275

క॥ వర్ణాశ్రమధర్మంబుల । నిర్ణయము లెఱింగి ధారుణీజనముల సం
పూర్ణకృపారతిఁ బ్రోవఁగ । దుర్ణయములుదొలఁగి సిరులుదులదూఁగె మహిన్.

ఉ॥ ధీరత దొడ్డనాయఁడును దెప్పలనాయఁ డరణ్యమార్గ సం
చారము సేయఁగోరి తగుసైన్యముఁగొల్వఁగఁ జాపబాణ తూ
ణీరకృపాణఖేటక మణీమయవర్మములన్ ధరించి శృం
గారమెలర్పఁగాఁ బటహకాహళనిస్వనముల్ సెలంగఁగన్ 277

మ॥ పులిసైనన్ వదలించి మించి బెదరింపుల్ జూపు పెన్పోటుకు
క్కలు పందిపోటులు వల్లెత్రాళ్లును జిక్కంబుల్ జిగుర్గండెలున్
వలలుం దెంపుడు కృష్ణసారములు సాళ్వంబుల్ మఱింగొన్ని మ
చ్చులు నాఖేటమృగప్రసాధనలుగొంచుం గొంద ఱేతేరఁగన్ 278

ఉ॥ పందులకందువల్ వెదకి పక్షులపక్షములుత్తరించి రొ
మ్మందలమందలై యుఱుకు మారితివాహములన్ వధించి జ
ళ్లొక్కఁడక కొంద ఱొక్క మొగి నుద్ధురవృత్తిఁ దరక్షుసంతతిన్
సందులసందులన్ నఱికి సత్వములన్ మడియించి గొక్కఁటన్ 279

తే॥ జనవిరోధిమృగంబుల సమరి సమరి । మరలి చమరీమృగముల చామరలు బర్హి
బర్హముల్ దంతిదంతముల్ భల్లుకాజి । నాదు లెడలించి తెచ్చి రామోదమెసఁగ

చ॥ వెసనొక్కుమ్మడి వేటలాడి గహనోర్విం బాయుచో నార్లగొం
డ సమీపంబున వారిజాకరము వేడ్కంజూచి సైన్యంబు ల
ద్దెసనిల్వన్ నియమించి మించుచుఁబగం దివ్యాంబువుల్ గ్రోలి వె
క్కసమొప్పారఁగ విశ్రమించిరట వృక్షచ్ఛాయలన్ వేల్మిడిన్ 281

క॥ అట నార్లగొండపురినుం । డెటికిఁ బోకుండు బూరటులు సైన్యంబుల్
దటుకునఁ జూచి మహీవరుఁ । డిటవిజయము చేసెననుచు హెచ్చిన ప్రేమన్ 282

ఆ॥ ధవళయావనాళ ధాన్యంబులొకకొన్ని । తెతతెతవేరి ప్రీతితోడ
దొడ్డనాయునకును దొరకొనియాకాఁపు । పట్టి యొసఁగె నవి యుపాయనముగ

కం॥ ఆయుపహారముఁ గొని పెను । నాయఁడు సైన్యములు పటహనాదంబులుగన్
బాయకనిరతము తెప్పల । నాయఁడు తనఁగొలువ వచ్చె నగరంబునకున్ 284

వ॥ ఇట్లు పురంబు ప్రవేశించి 285

కం॥ యావాంకురామబీజ । స్తోమం బవనీశ్వరాజ్ఞ శుద్ధాంతస్త్రీ
కామితముగునని పంచిన । నా ముగ్ధాంగనలు వాని నధికప్రీతిన్ 286

సీ॥ పులఖండమునఁ జిన్నిపూసలుగావించి యబలలకై విభుండంపినాఁడొ
కపటిబో నూదినకలధౌతమున గుండ్లు కల్పించిపుచ్చెనో కాంతుఁడిటకుఁ
గ్రపంబునీరుగాఁ గరఁగికర్పూలఁబోసి జననాథుఁ డంపెనో శ్యామలకును
వనమల్లికా లతావళులఁ బుట్టిన కోరకములిట్టులని చెనో తెచ్చె విభుండు
పచ్చిముత్తెంబులెటనుండి తెచ్చినాఁడొ । హారములఁగూర్తు మనుచు శృంగారవతులు
సూచికలఁబట్టికూర్చిరి సూత్రములను । ధరణి ముగ్ధలుగారె శుద్ధాంతసఖులు 287

కం॥ ఆహారంబులుమానుచు । నా హారంబు లొనఁగూర్చ నలివలుతనులో
నాహా! ంజీవి మనకా । రాహారితలఁ బ్రాలటంచు వాక్షించి రోగిన్ 288

వ॥ పొందియు 289

కం॥ ఈముత్తియపుమహీజము । తేమాడ్కి ఫలించు మొల్చునెట్టుల పత్ర
స్తోమంబు లెవ్విధము తే । భూమింజనియించు నెట్టిపువ్వులుతలఁచన్ 290

కం॥ ఈపచ్చిముత్తెపుఁజె । ట్లెపాలమునఁ గలవో వాని నెఱిఁగినమనుజుం
డొప్పి సమూలములుగనవి । జూపింపఁగవలయు మేముజూచెదమిచటన్ 291

కం॥ సదనోద్యానంబుల నిది । యదనెఱిఁగి సమృద్ధిబొంద నావాలములన్
గుదురుగ నాటందగునని । మదిరాక్షులఁ బంచి రచటిమానిను లెలమిన్ 292

వ॥ ఇట్లు పంచిన 293

కం॥ చేటికలరిగి మనంబున । నాటఁగనిట్లనిరి దొడ్డనాయునితో ని
బ్బోటులు చెప్పినక్రమమునఁ । గాటుక కన్నవలఁ జిలువగవు లొప్పారన్ 294

కం॥ కరుణాత్మక! రాజాంతః । పురకాంతలు నిన్న మీరు బుత్తెంచిన యా
ఖరయావనాళబీజో । త్కరములు ముత్తియములనుచు గాఢాపేక్షన్ 295

ఉ॥ అవ్వత్సంబులుజూడఁగోరి ధరణీకాంతఃపురస్త్రీలు న
ద్భావంబొప్పఁగఁ జెప్పిపంపిరి కృపాపారీణ! తేఁబంపు మీ
ప్రావీణ్యంబున, కెంత కార్యమిది కల్పత్వ్రజముంజూచి దు
ర్భావుల్ శాకమువేఁడుచందమునఁ గోరంగూడునే భామినుల్॥ 296

చం॥ అనవుడుదొడ్డనాయుఁడు రయంబునఁ దిప్పలనీనిఁ బంపఁగా
మనుజనుదారి సేగి తనముంగలిచేనికిఁ గావలున్న వా
నినిబోఁడఁ గాంచి వేడిన వినీతిఁ నెఱుంగక మూఢచిత్తుఁడై
చనుమిఁకఁ జాలుఁ జాలు విరసంబులుపల్కక కండ్లక్రొవ్వునన్॥ 297

ఆ॥ దొడ్డవారసుమను దోలిఫలంబంచును । లేతబ్రాలుమీకుఁ బ్రీతితోడ
నిచ్చినందులకునా మెచ్చిమా చేనెల్లఁ । గొల్లఁబుచ్చఁదలచుకొనుటలెల్ల॥ 298

ఆ॥ ఊచబియ్యమునకు వాచవిగొనిమీర । లూచకోతఁ గోయఁజూచు టెల్ల
«నాటవసించుమన్న నిల్లావరించిన । చంద»మయ్యెనింకఁ జాలుఁబొమ్ము॥ 299

చం॥ బలములతోడవచ్చితిమి బాలుఁడితండని చూడకుండుఁ డ
గ్గలమయి మాపురంబున నొకండె భవత్పటుసైన్యరాజి వి
చ్చలవిడి గోటమీటు ననఁ జయ్యనఁ దిప్పలనీఁడు బల్కె ని
ట్లలబరిపుచ్చ నేల నయిదాఱుగడల్ వితిచిమ్మ నావుడున్॥ 300

కం॥ ఆకాఁపుకొడుకు కోపా । ద్రేకంబునఁ గారులాడఁ దిప్పలనీఁ డా
లోకించి సంజ్ఞ చేసిన । వీకంగోసాయిలాఱువే లొక్కమొగిన్॥ 301

సీ॥ నడిరేగి చేనికావలికాండ్రఁ జెడ కొక్క లౌడిసెలత్రాళ్ళతో నుబ్బఁగట్టి
మంచలెల్లను బటాపంచలై పడఁద్రోచి గుడిసెలు నేలపైఁ గూలఁద్రొక్కి
వెరబొమ్మలను వికావికలుగాఁ బోడిచేసి కంపకాలగ్గిలోఁ గలపిపైచి
కర్కరీఫలములు గలయమూటలుగట్టి పెనచిపండినజొన్న పెల్లగించి
తెచ్చి రాక్ష్వేలమోపులు గ్రుచ్చికట్టి । సారె పెదబొబ్బలిడుచు గోసాయులిట్లు
వేడుకలరఁగఁ దిప్పలనీఁడు మున్ను । నడచిగురిజాలనగరిమున్దలఁ జొరంగ

కం॥ ఈకార్యమునను గొల్లం । బోకను వగ నార్లగొండభూకాంతునితో
నాకావు లెంకింగింపఁగ । నాకంపితకుండలోత్తమాంగుండగుచున్॥ 303

మ॥ రవివంశోత్తమ! నీవు నీకరణిఁ జోరత్వంబునం బొచ్చి బి
ట్టపిషేకంబున మాపొలం బడపి పాల్పోవంగాఁ జేసి తే
యవనీశోత్తమ! ధర్మమాని తగుసైన్యంబులన్ వేసం గొల్వ న
న్నవలీలన్ విదళింపు లేనియడఁ దప్పన్నన్ నినుం గాచెదన్॥ 304

కం॥ అని పత్రికాముఖంబున । జనపతి లిఖియించి పంప సత్వరమునఁ ద
ద్ఘనభుజుఁ డల్లుక్ష్మాపతి । తనసచివాగ్రేసరుని ముదంబునఁ బనిచెన్॥ 305

చం॥ పనిచినదోడ్డనాయుఁడును కృపాణశరాసనబాణతూణసా
ధనయుతుఁడై మహోకలహోత్సరుఁ డెప్పలనీని వెంటఁ దో
డ్కొనిచని యార్లగండిఁ గొనకూఁతలుమింగెడి సైన్యరాజితో
జనపతియాజ్ఞ మాలినిడి సాగె ధరాస్థలి గ్రక్కదల్చుచున్॥ 306

కం॥ చనియార్లగండినికటం । బున గర్భవ్యూహ ఖ్యాతిఁ గనిపించినఁ ద
జ్జననాయకుండు రథసము । ననుసైన్యస్థితివెడలె నెఱిదెస లద్రువన్ 307

కం॥ కట్టుబడినాయకులు సమ । కట్టినభోజులును నగరికావలివారల్
శెట్టిలు మన్నెదొరలును । బట్టినవారెల్లఁ బోర్లఁబడి బీరమునన్॥ 308

సీ॥ యవన బర్బర పుల్కస వనాట పారసీక పుళింద బృంద మొక్క మొగినడువ
శక తురుష్క మరాట శబర గోపాలక క్షపణ వసాతిసంఘ మొక క్రేవ
మాన్యరాజన్య సామాన్యసేనాన్యాదికోద్భటబలశాలు రొక్కమూలఁ
గుంతాసిముద్గరక్షురికాదిసాధనోత్కరవిశారదు లొక్కదారిమునరఁ
బటుతరానీకినీమూలి భానుబింబ, మావరింపంగ భూమి గ్రక్కదల వెడలి
యార్లగండిపురాసన్న యావనాళి, జాంగలికభూమిబలమెల్ల సందడించె 309

కం॥ అలదోడ్డనాయుఁ డాబల, ములఁ జూచి యమూల్యధైర్యమున దరహాసం
బలరారుమోమునను దె, ప్పలనీనినిజూచి పలికెఁ బటువిక్రముఁడై 310

ఉ॥ కూటువమూకలం గనిసి కోటనుని యార్చుచుఁ జేనికావు పో
రాటముఁ దెచ్చె నిప్పు డసహాయులమై యెదుటించి చొచ్చి పే

డంబులు వృథాకొండాటంబులు మాని శౌర్యంబులు పూని యనిజేసినఁగాని పోనీయము నువారును. నై బోరునలేచి రొంచినమదంబున నిశాచరవీరులబలంబులుగూర్చి బారు లుదీర్చి యున్నసిడిజేర్చి మిన్నుమిట్టనార్చి యెదిర్చిన. 76

ఉ॥ అంతకుమున్నయింద్రుఁ డమృతాశనలబ్ధ బలాఢ్యులైన య
త్యంతకముఖ్యదిక్పతులనంపఁ గూడుక భూమిభృద్ధను
డ్యంతకు మొక్కి చక్రధరునాజ్ఞ శిరంబునఁదాల్చి నిల్వ నం
తంతకు బాహుదర్పమున నాహవకేళికి కాలిపోలికన్. 77

కం॥ ఆ సమయమున నశనిజ్వాళ । రాసమయంబయ్యె సంగరాంగణ మది పై
పై సమయఁదొడఁగె నన్యో । న్యాసమశరధారలన్ సురాసురసేనల్. 78

కం॥ సెలగోలలఁజేఁ బులుగులఁ । బలుకోలలమృగకులములఁ బరిమార్చుగతిన్
"సెలగో సెల" గని పొరిగొని । రెలగోలలనే పదాతులితరేతరులన్ 79

కం॥ కరితురగరథపదాతులఁ । గరితురగరథపదాతికటకంబులతో
సరిగడవనడవఁ బొడసఁగ । పురునడిఁకలఁపడిన ఘోరయుద్ధంబయ్యెన్. 80

కం॥ అలమ్ముల వాలమ్ములఁ । గీలమ్ములఁగప్పి నసుర గినిసియొకఁడు క్రో
వ్వాలునకొకవాలునఁ గర । ఖేలనమునఁ గేలు గాలు కీలెడలించెన్. 81

కం॥ దేవవిభుఁడొకఁడుతనలో । నేవలుగావదలివదలియెదిరినఁ గ్రుద్ధుం
డై వాఁడిచంద్రహాసము । చే వానింగదిమి యఁదిమిచిదిమెశిరంబున్. 82

కం॥ కుంతంబుల దంతంబులఁ । బంతంబులఁ బొడిచి కఱచి బలమఱవనుజుల్
గంతుల జంతుల దంతుల బంతులవలెఁగూర్చిరపుడు బాహాసత్కటిచేన్. 83

కం॥ సురవీరుఁడొక్కశరమునఁ । గరిఫాలముఁగ్రుచ్చెఁ జక్కఁగావాలమునన్
గరిదుస్సియువలతురగం । బురగముక్రియఁద్రెళ్లిరొల్ల నురముల్ మెరిసెన్. 84

వ॥ అప్పుడు. 85

కం॥ చతురామరరథనురుద్ధురి । శతధానటదర్థచంద్రశరలాఘవఖం
డితపుండరీకతతిచే । శతచంద్రంబయ్యెనభము చర్చింపంగన్ 86

కం॥ అమితతురంగములు తరం । గము లలదఱుఁజాలు విరాలు కలితసితచ్ఛ
త్రములు శతపత్రములు గా । సమరతలంబను కొ నమరసరసియపోలెన్ 87

మ॥ బహుధారాయోధనసాధనాద్భుతకలాప్రౌఢిన్ విజృంభించి యి
ట్లహరీశప్రతిమానతేజాలు నిలింపాధ్యుల్ సుధాసేవచే
గహనంబంటినపావకార్చులగతిం గన్పట్టినం దన్మహో
నిహతిం దుష్టనిశాటరాట్కటజముల్ నిర్మూలముం జెందఁగన్. 88

కం॥ సెలకట్టకిటులనిఖిలా । శలకట్టకడలకుఁ దక్కుజనములు తమజం
కెలుకొట్టుబడుచుఁబరువన్ । గెలకొట్టుచు నవ్విరపుడు ఖేచరవీరుల్. 89

ఉ॥ అష్టమహావిభూతులకునాలయమైనభవాష్టమూర్తులో?
యష్టహరిత్కరీంద్రములో? యాహవదుస్సహశౌర్యధుర్యదు
గ్గష్టభుజంబులో? యన శరాసనభీషణపాణులై సమా
త్యాష్టకముల్లగింపఁగ మహాచలుఁడం దనుజేంద్రుఁడుద్ధతిన్॥ 90

కం॥ గహనావహ దహనానస । వహనా జహద స్త్రశస్త్రనైపుణిచే నా
గ్రహరీతుల నహరీశ న । రహరీశ మహోజుఁడై దురంబున నెదుటన్ 91

చం॥ ముదమున నార్చి పేర్చి యటమున్న బలంబులనిల్వరింపుచున్
మదమునఁ దత్ప్రధానులెనమండ్రు దిగీశులతో నమార్కొనన్
గదనముఘోరమయ్యె మహికాంతకుమిక్కిలిభారమయ్యె నొ
ప్పిదములుదూరమయ్యె గ్రహబృందములందుఁ జెమోరజోవృతిన్. 92

వ॥ అప్పుడు 93

సీ॥ తురగరింఖోద్ధూతధూళిధూసరితమై యభ్ర మర్కాస్తమయంబుఁ దెల్ప
నిబిడధ్వజార్కమాణిక్యదర్పణదీప్తి సాంధ్యరాగచ్ఛాయ సంఘటింప
శరవారి భేదిత ము స్త సముత్పతన్మౌక్తికములు తారాగణోత్కర్ష మెసఁగ
దనుజాధినాథైకధవళాతపత్రంబు పూర్ణచంద్రోదయస్ఫురణ నెఱప
దితిసుతామాత్యధాటికాతిప్రరజని । రజనిచరవిస్ఫుటాట్టహాసజని సాంద్ర
చంద్రికలు బర్వ సౌపర్వసైన్యవదన । పంకజంబులు ముకుళితప్రాప్తిఁ గాంచె 94

చం॥ బిఱుసుననిట్లుమార్కొనుచు జేర్చి మహారథులేర్చి పోరినన్
దొఱఁగుశిలీముఖంబులును ద్రుంగురథంబులు గ్రుంగుచక్రముల్
విఱుఁగుశరాసనంబులును వ్రీలుగజంబులు వ్రాలునశ్వముల్
తెఱలుఁపదాతులై సురలు దీనతనొందఁగ దిక్పతుల్ రహిన్ 95

చం॥ చెదరినవారునిల్చుచును జిక్కులుదీర్చి భయంబుఁదెల్ప మ
న్మదమునఁబోరుదైత్యనరుమంత్రులఁదాకి దిగీశులుజ్వల
త్ప్రదరములం దదీయరథరథ్యశరాసనకేతుసారథుల్
చిదురుపలై ధరందొరుఁగఁజేసిరి యాశరరాజు గాసిలన్ 96

సీ॥ కూల్చెనొక్కని శతకోటిచేసురరాజు వ్రేల్చెనొక్కనివహ్ని భీమశిఖలఁ
జదిపెనొక్కని నుక్కుగుదియచేసమవర్తి మెదిపెనొక్కని ముష్టిమిసిమి నసుర
చిదిమెనొక్కనితల శితశరంబులఁబాశి యదిమెనొక్కని వాయువతిబలమునఁ
దుడిచెనొక్కని వాలుదొరసియుధనదుండు పొడిచెనొక్కని శూలమునఁ బురారి
యంతకునివీటి కిట్లమాత్యాష్టకంబు। నరుగఁగని యేటుదాకినయురగమటులఁ
జటులగతిరోఁజుచును మహాచలుఁడు బలుఁడు।భిదురధరుమీఁదమదిఁ గిన్కగదుర నెదుఱ

కం॥ హితకోటినడుపఁ గమలా। హితకోటీరుఁడును దోడనే తేరవడిన్
శతకోటిధరుఁడుదాకెను । శతకోటివిశిఖంబుతో నిశాచరనాథున్ 98

వ॥ ఇవ్విధంబున 99

చం॥ నొగనొగదాకి రథ్యములనూకి సురాధిపదానవాధిపుల్
మృగపతులట్లు బెబ్బులులరీతి మదేభయుగంబుభాతిఁ జి
త్రగతులఁ బోరుచుం దిశలువ్రయ్యలువాఱఁగఁ గూయుచున్ మహా
శుగములునింపుచున్ మిగులశూరతఁబెంపుచు విక్రమంబునన్ 100

కం॥ ధనువులు ద్రుంచుచుఁ దనువులఁ। యనువులనొంపుచును ఖేటకాసిగదాదుల్
దునియలుసేయుచుఁ దనియక। యనియల్కనొనర్చి రింద్రుఁ డసురేంద్రుండున్ 101

సీ॥ శరభమై సరభసస్ఫురణఁజెంగటఁబోల్చు సింగమై తుంగమై చిత్రినిల్పుఁ
జిఱుతయై గురుతరస్థితిరొప్పికుప్పించుఁ గోలమై లీలమైఁ గోటరించు

ద్విరదమ్మై దరదమ్మై ఖరిజృంభణము సల్పు భుజగమ్మై నిజగరస్ఫూర్తిఁ దెలుపుఁ
బవనమ్మై జవనసంభ్రమునఁ సుడిగూర్చు దావమ్మై యేవ నెంతయును బేర్చు
సమరవిస్ఫురభుజబలచటులనిఖిల। దిగధిపతితతిదృఢతరధృతివిదళన
కరణపరిణతబహువిధకపటనటన। యమితవిమతకులుండు మహాచలుండు 102

తే॥ దానవేంద్రుండు మాయానిధానవృత్తి। మానకిటు లెంతయును జాయమానబహువి
కారముల మారుకొని యహంకారమెసఁగ। దండనించి యధిజ్యకోదండుఁడగుచు 103

కం॥ పసలకనించెను నిశిత। ప్రదరంబుల దిగధిపతులఁ బది యిరువది ము
ప్పది నలుబది యేబది యఱు। వ్వది డెబ్బది యెనుబదింట వాసవముఖులన్ 104

కం॥ ఆ యమ్ముల వడివారల। యాయమ్ములు గాడిపాఱి యతిరయమునఁ ద
త్కాయమ్ముల మిక్కిలిఁ బెను, గాయమ్ములు సేయ రోషకలితానను లై 105

చం॥ హరివిలుద్రుంచెఁ గేతనము నగ్నిహరించె యముండు సారథిన్
నుఱుమొనరించెఁ బైగొడుగు నుగ్గుగఁ జేసెఁ బలాశి వాజులన్
వరుణుఁడు గూల్చె మైమరువు వాయువు గవల్చె ధనాధినాయకుం
డరదము ధూళిగూర్చె హరుఁ డయ్యసురన్ వెస నేర్చె నమ్ములన్॥ 106

కం॥ ఇటుల హతసాధనుండై। చటులహరిత్పతిశరాగ్నిసంధిత తను లం
పటల భటులన్ మరల్చుచు। బటులఘుగతి నసుర డస్సె బలుగదఁ గొనచున్ 107

స్రగ్ధర.

కుప్పించున్ సింహనాద క్షుభిత దిగిభుఁడై క్షోణి కంపమ్ము నొందన్
నొప్పించున్ సర్వగీర్వాణులఁ బ్రబలశిఖానోకహ స్తోకపుష్టిన్
దప్పించున్ భూరజోబాధకము శరధి నుత్తాల రక్తాతతాప్తిన్
మెప్పించుం గ్రొత్తఁగా నామెతలఁ బొదల సంప్రీతిచే భూతకోటిన్ 108

కం. ఈకరణి నతఁడు బహుమాయా। కరణీయములఁ బోర నరిదోర్బల లుం
ఠాకరణి వజ్రి ఖేచర - లోక రణితవిజయకాహళుండై యలుకన్ 109

మ॥ చలమొప్పారఁగ నర్ధచంద్రశరముల్ సంధించి రెండున్ మహా
చలబాహాయుగళంబుఁ దున్మెఁ మణిరాజత్ఖేటకోద్యద్భుజా

వ॥ ఇట్లు భుజించినవారల గంధపుష్పాక్షతతాంబూలంబులం బరితృప్తులం గావించి వారలయాశీర్వాదాక్షతంబులు గైకొని యానందనందనుం డమందానందంబున శ్వశురప్రేషితభావుకప్రేరితుండై నిజవియోగాసహంబునం జనుదెంచు దెలిదీవియనన్పు వజ్రరథం బెక్కి నిజకన్యకాపరిణయాగుణ్ణయకలుషితాంతరంగతరంగిణీవల్లభప్రేషితులై చనుదెంచి చెంగట మెలంగు మంగళపాఠకుల సంగీతప్రసంగభంగీసౌభాగ్యంబు లాకర్ణించియునట న్నటీపటీరగంధి తటిద్వల్లికామతల్లికాభినవప్రభావిభవంబు లభివీక్షించియు శేషనంశితాప్రయుక్తవచనకౌశలంబున నైసర్గికపరుషరవంబున నయంబును భయంబును జూపుటయుఁ బోవచి యపారపారవశ్యంబున శిరఃకంపంబును మందగమనంబునుం బొందిన భుజంగిపుంగవులును జీమూతసార్వభౌములనం బనుపడిన పటుతరధ్వజంబులు ను దనకు మక్కువమగండగు నక్కమలాక్షుం డొక్క మొగిఁ బెక్కు చెలులను నక్కజంబుగాఁ జొక్కి తను లెక్కసేయండని యుల్లంబగిలి మిగులం బొగలుపుడమిప్రాఁబోఁడి మేనివేఁడిమిం బోలె మిట్టిపడినట్లు కొట్టక చౌపట్టంబులుద్రొక్కు నారట్టసాయంబులును నాగనాగరాజితగండమండలామందనిష్యందమాన మానిత దానపయఃపూరనిర్వాపణకుల్యాకార సాకల్యాకల్య నేమిరేఖాపాటనంబులగు రథంబులును నిగనిగలు దేరుత న్నగరిమగువల నగుమొగంబులను గొప్పలై యొప్పు నమృతపుఁగుప్పె లప్పనలుగాఁగొని యొప్పింప నేతెంచు చంద్రమండలంబులో యనఁ బొబ్బరంబగు ధవళచ్ఛత్రంబులును, ననవద్యహృద్యవాద్యఘోషాతిశయబధిరీభూతులై చేష్టావిశేషంబుల నేసధ్యంబులువైచి మేషలపై నర్తనక్రీడలనున్న ప్రోడచేడియల నిడువాలుచూపులు మణితోరణంబులని పుటంబెగసి యందుకొనం గమకించువీరభటులును, జెలంగ మందమందగమనంబున రాజమార్గంబున నేగి యేగి రథంబుడిగ్గి మణిపాదుకలఁ దగరించి రాజముఖ్యదత్తనీరాజనపూర్వకంబుగాఁ జంద్రశాలాకదంబితచందిరంబగు తద్రాజమందిరంబుఁ బ్రవేశించి శుభాలంకారంబులప్రోదియగు వివాహవేదిం జేరి యుభయపార్శ్వనివిష్టవేదపాఠకంబగు కనకపీఠంబున నధిష్ఠించె నంత  ౪౪

సీ॥ చికిలిద్దుదొనసొచ్చుచిత్తజుశరమునా మంగళస్నాతయై మడుఁగుఁగట్టి
చనుఁగవమించె నాతునియుఁగౌనసురీతిఁ బగటి మేల్రవికె గుత్తముగఁదొడిగి
సిరిచూపినలరాజు చేఁ గనకస్నానమొందుపొందున సొమ్ములందపఱిచి
హరిఁబొందుమని మరుండంపుచీట్లనఁగ గేదంగిరేకులఁ జాలఁ దల ధరించి
నీలకబళితనవతృణలీలనలర । గన్నుఁగడనంజనము రేఖగాఁగఁ దీర్చి
బలియుజడఁద్రొక్కికొనుశంపబలె నెవచ్చె । మందగతియొప్పఁ జెలులతో మద్రకన్య॥

సీ॥ సారసారెకు దంతచకచకల్ బయలెక్కఁ దీవి దిక్కులఁ బల్లటీలు ద్రొక్కఁ
వీడెంపుఘుమఘుమల్ గూడినవదనగంధంబు కప్రపు వసంతంబుఁ జిల్కఁ
నగ్గలంబగుకల్కిసిగ్గులు లోచనతోయజంబులు నిండి తొంగిచూడ
రమణమాటుగనున్నరతనంపుమొగరంబు డంబుగా నవఁ గొండెంబుసెప్ప
మంత్రసరణులు తడబడ మరచిముసలి, యొజ్జబాపలు నాలింపఁ బజ్జఁజేరి
కంచుగీసినతెఱఁగున ఖంగురనఁగ, జేడియలుఁగూడి ధవళముల్ బాడుచుండ 90

కం॥ మధుపర్కపూర్వకముగా, మధుహల్లకభల్లకోపమానుండగు న
మ్మధుమథనున కర్పించెను, మధురాధర నవనిపాలమండనుఁ డంతన్ 91

సీ॥ చనుఁజక్కవలను నిశ్చలమైత్రిఁ జూడంగ వ్రాలిన హేళినాఁ దాళిఁ గట్టెఁ
ఎమకమేర్పడఁగందుతరుణిధరణిఁ జిల్కఁ బలుముబ్బు నాఁ దలఁబ్రాలొసంగె
నింతితోడను గంతుఁ డేచినముచ్చటల్ జెప్పెడిభంగిగాఁ జెట్టఁబట్టెఁ
గుంభిని నీకాలిగోరుఁ బోలఁగలేరు పడతులన్గతి సప్తపదములాన
వీరపానంబు చేగారవించి హృద్గ, తాత్మభవవహ్నికిం బ్రతియనుపుకరణి
నాజ్యముఖహవ్యములు వేల్చి యంత వహ్ని, నాత్మ నారోపణముఁ జేసి నచ్యుతుండు

వ॥ అప్పుడు సంతుష్టనిజస్వాంతుండగు బృహత్సేనమహీకాంతుం డల్లుండగు వల్లవీవల్లభున కనేకదివ్యాంబరమణిభూషణాదికంబు లరణంబులుగా నర్పించి యసాధారణంబుగా మన్నించెను. 93

లయగ్రాహి

తుంగము గళన్మదతరంగము కపోలచలభృంగము హతారిచతురంగమును గాంభ
ద్రాంగము జవానిలకురంగము మహానటనచంగము జితోగ్రరణరంగమును గా ని
ర్భంగము ధ్వజోన్నతపతంగము సకార్ముకనిషంగము తటిచ్ఛయపిశంగమును గా మా
తంగమును బారసితురంగమునుఁ గాంచనశతాంగమును శౌరికినొసంగె న్నృపుఁడంతన్

మ॥ ప్రియమొప్పారఁగ నక్కుశేశయమనోహ్లాన్మండలంబున్ బిలే
శయరాట్కుండలమున్ సుఖాప్తి మరపింపంజాలు నా నిచ్చె నెం
తయు నేకాండములై ధగద్ధగలు చిందన్ గెంపుతాఁ బేటిక
ద్దియయున్ దంతపురచ్ఛబల్లయు ధరాధీశుండు దైత్యారికిన్ 95

28 చింతపల్లి వెంకటప్పయ్యగారు, గరికెపాడు.

29 పుప్పాలపాటి వెంకటసుబ్బయ్యగారు, కరణం పుప్పాలపాడు.

30 గోరంట్ల పున్నయ్యగారు, డిటో.

31 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.

32 చింతలచర్వు గోవిందరెడ్డిగారు, గ్రామమునసబ్, చంద్రాజుపాలెం.

---

"అప్రస్తుతప్రశంస.,,

ఇంతకుముందుమా చందాదార్లు, శతావధానుల వివాదమునుగురించి చదివియేయున్నారు, ఆకలహము సమూలముగా నీగ్రంథమందు వ్రాయఁబడినది, వెల 0-4-0. పోష్టుఖర్చుగాక.

కవితాకార్యస్థానం, పిఠాపురం.

---

"వృద్ధవివాహము.,,

హాస్యరసప్రధానమై నీతిబోధకమగు నాటకము, చదివినకొలఁది నవ్వుచేకడు పుబ్బపోవుచుండును, కన్యాశుల్కము, వరశుల్కము, మొదలగువానికంటె మనోహరముగను సుబోధముగను వ్రాయఁబడినది. 122 పేజీలు మంచిదళసరికాగితములు, పెద్దయక్షరములు, వెల రు 0-8-0లు మాత్రమే

డి. వి. రమణారావు అండ్ కో

తణుకు, కృష్ణాజిల్లా.

---

అభినవసరస్వతి కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

—— -:(o):——

| | | | |
|---|---|---|---|
| అళ్ళయాచార్య విజయము | 0-4-0 | నీతిగీతులు | 0-2-0 |
| కరిణీకోద్ధారిణి | 0-4-0 | గురుపరంపర | 0-2_0 |
| వాసంతికాపరిణయనాటకము | 0-4-0 | వత్సలనీతిశతకము | 0-1-6 |

వలయువారలు సొమ్ముపంపిగాని వి. పి. ద్వారాగాని ఈక్రింది వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

 జనపాటి పురుషోత్తం, సబ్ ఎడిటర్,

జానపాడు పిడుగురాళ్ళపోస్టు.

## ప్రధాన పోషకులు.

1 శ్రీశ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు,
2 ప్రతిపాటి బ్రాహ్మణులు వైశ్యులు.

## పోషకులు.

1 పులిపాక పూర్ణయ్య పంతులుగారు. వకీల్, నర్సావుపేట.
2 రంగానర్ఘుల హనుమయ్యగారు, జిల్లాకోర్టువకీలు, గుంటూరు.
3 తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం సుగ్గిరాల.
4 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు, ముక్తాదార్ చొప్లేరు.
5 రామసింగుగారు, నెల్లూరు.
6 అల్లాడి లక్ష్మణరావుగారు, కరణం, జంగపల్లి.
7 పోకేపల్లి రాజేశ్వరరావు దేశముఖుగారు, పెద్దపల్లి.
8 దేవరాజు మురళీధరరావుగారు, పోదెల

---

## చందాదార్లు.

1 కోట సుబ్బారావుగారు, వకీల్ నర్సారావుపేట.
2 తుమమెళ్ళ హనుమంతరావుగారు, రివిన్యూయిన్స్పెక్టరు బ్రాహ్మణపల్లి
3 ఇనపకుతికె లక్ష్మీకాంతంగారు, తరందారు బద్వేలు తాలూకా
4 యియ్యూణ్ణి అనంతపద్మనాభ దేశికాచార్యులుగారు, వెంకట్రాముని మోరి వాణిపేట.
5 సంగా వెంకటరత్నంగారు, బ్రాహ్మణకోడూరు.
6. ముటుకూరి గోపాలకృష్ణయ్యగారు, కరణం ముటుకూరు.
7 విస్సానర్ఘుల సీతారామయ్యగారు, నూజవీడు
8 గారిపద్ది సదాసివయ్యగారు, లైసెన్సుగుమాస్తా నకరకల్లు.
9 ముష్టిరామమూర్తిగారు, పోలీసుసబుయిన్స్పెక్టరు పిడుగురాళ్ళ.
10 చింతపల్లి రామయ్యగారు, కరణం చింతపల్లి.